శ్రీ—(అపవారించి) బట్టబయలుసేయు టేల? ఈకర్మ మెప్పుడైన నెఱుంగుదురా? అయ్యయ్యో! ఎంత ప్రారబ్ధము!

విప్ర—(అపవారించి) శ్రీనివాసా! నీ కిది యేమి వెఱ్ఱి! నాదోషమున నేను గాంతానురాగుఁడను గావలసివచ్చెను గాని యసత్యవాది నగుటకు నా కేమి కర్మము!

మాధ—మీరును దానికిని సంబంధము జరిగినది కాఁబోలు నేమి?

విప్ర—శారీరసంబంధ మింతవఱకు జరుగ లేదు.

శ్రీ—(అపవారించి) స్వామీ! ఇప్పు డేల యసత్యమాడితిరి?

విప్ర—(అపవారించి) అసత్యమేమున్నది?

శ్రీ—(అపవారించి) మీరు దేవదాసి గదిలోనికిఁ బోయితిమని చెప్పితిరి కాదా?

విప్ర—(అపవారించి) ఔను. రతిబాధానివారణమునకై యదిరమ్మనెను.

శ్రీ—(అపవారించి) అగ్నియుఁ గాని మీరుఁ గాని యచ్చటఁ దొందరయేమియుఁ బడ లేదా?

విప్ర—(అపవారించి) ఏమియుఁ దొందర లేదు. తనయింటికి నన్నుఁ దీసికొనిపోవుచున్నది. నే సరే యంటిని. ఇదివఱకు రాలేదు. అందుకొఱకు నేనే బయలుదేరితిని.

శ్రీ—(తనలో) ఇది యేమి? వింతగ నున్నది. అసత్యమాడువాఁడు కాఁడు. హా! దైవమా! ఈతని యాంతరశుద్ధత నింకఁ గాపాడుము.

మాధ—స్వామీ! అట్టులైన నిదివఱకు మీరు దానికిఁ జరుగనేలేదు. దానికి మీపై ననురాగ మున్నదా?

విప్ర—దానికిఁ బూర్ణముగ నున్నది యదే కాదా?

శ్రీ—(అపవారించి) నటునిదేహమును జంపువాఁడు పరమక్రూరకిరాతుఁడైయుండ నాతనియాత్మను శరీరమును గూడఁ జంపునది యనురాగ ప్రపూర్ణురా లనెద రేమి?

మాధ—(తనలో) ఈపంగనామాలబాపనయ్య యకాలపువెఱ్ఱిముండ కొడుకు. దారి తప్పి నూతనశృంగారమునఁ బడినాఁడు. ఈతని యొద్దవిశేషధన ముంటచేఁ గాఁబోలు టక్కులాఁడియైన దేవదేవి యీతనియజ్ఞపసుపుగఁ బట్టినది. ఈతనివలన నాకుఁగూడ నేమైన లాభింపవచ్చును. (ప్రకాశముగా) నేసివేశ్యావీధిని రెండు పుష్కరములనుండి కసిపెట్టుకొని యుంటిని. మీవంటివారి పుణ్యమునఁ బొట్టపోసికొను చుంటిని. వేశ్యలలోఁ బ్రకృతులు బహువిధములు. ప్రపంచమే యట్లున్నది తెలుసు. పడుచుఁ దనము గలిగినదానివలెఁ బైకిఁ గనఁబడి నంతమాత్రమున నది యౌవనవతి యని మన మనుకొనఁ గూడదు. చిత్రకాలము! ఊడిపోయిన పండ్లకుఁ గట్టుడు పండ్లు కద! నెఱసిన వెండ్రుకలకు రంగు కద! ముడుతలమొగమును సాగఁదీయుటకు జిగురులు గద! పాలిపోయినచెక్కిళ్లకుఁ బూఁతలు కద! ఆశ్చర్యము! మొక్కజొన్నపొత్తివలె నున్న మొగమున్నదైన మెఱుఁగులు కద! ఇది గాక, అత్తరుప్పు లని—అగరునూనె లని—దూదిమెత్త లని కొబ్బరిచిప్ప లని—నోరికట్టు లని—ఇంక నేమో యని పెద్ద పెట్టె కట్టినంతసామగ్రి కద! మేనిమీఁద నాటు మన్నంత సేపు కన్నులు మొగముమీఁదనె గద! ఇంటికి వచ్చినతరువాతఁ జిలుక కొయ్యలను గద!

శ్రీ—అదియేమి?

మాధ—అయ్యో! ఎఱుఁగవా? నూటికిఁ బదుగురుసానులకుఁ జేత కన్నులు! ఇవి కాక, కొందఱు కొబ్బరికాయవలెఁ గొఱుకరాని కొయ్యలుగఁ బైకిఁ గనఁబడి లోన రసపూర్ణహృదయమును గలిగి యుందురు. ఇట్టివారిని నెఱ్ఱి వాయుగొట్టి యనుభవింప వలయును. కొందఱు పనస తొనవలెఁ బైకి మధురముగను

మృదులముగ నుండి యనుభవింపఁ బోవుసరికిఁ గటుక్కునఁ గఠిన మగుమనస్సు నష్టపెట్టుదురు. ఇట్టివారల దేహాత్మవిచ్ఛేదము చేసి యనుభవింప వలయును. మఱికొందఱు పైకిఁ గఠినముగనే లోనఁ గఠినముగనే యుందురు. ఇట్టివారిని బఱికి బెల్లమును జప్పరించినట్లు మెల్లమెల్లఁగఁ గరఁగింపఁజేసి యనుభవింప వలయును. కొందఱు మొండి చచ్చిన ట్లుందురు గాని సీమమిరియపుఁగాయవలెఁ గారమునఁ గ్రిందిగ్రుడ్లు మీఁదికి రాఁ జేయుదురు. కొందఱు బుట్టమిరియపుఁగాయలవలె బుంగలై యుండుటయే కాని వీరి నారబెట్టి యెండబెట్టి కాల్చినఁగాని యనుభవింపఁ దగదు. కొందఱు సున్నితముగ శిలాకివలె నున్నను దేశవాళిచెఱకువలె మిక్కిలి మధురముగ నుందురు. మఱికొందఱు బొంతచెఱకువలెఁ బూర్ణలై యున్నను గానుగ నాడి యేగో యింతనుక్కతోఁ బ్రొక్కి బుట్టలు కట్టి పాటకపుజాతి యనుభవమునకుఁ బాలునైచి సొమ్ము చేసికొనుటకు మాత్ర మక్కఱకు వత్తురు. కొందఱు పంచ్రకోఁతులవలె నెఱ్ఱమొగములతోఁ—గొందఱు కొండముచ్చులవలె నల్లమొగములతోఁ గొందఱుచిరుతపులులవలెనొడలినిండమచ్చలతోఁ—గొందఱుదుప్పివలెస్వేతపుచాగులతోఁ—గొందఱుతిర్యఙ్ముఖములతోఁ—గొందఱు పార్శ్వముఖములతోఁ—గొంద ఱధో ముఖములతో—

విప్ర—అయ్యో! మాకీగొడవ యింత నెందులకు?

మాంధ—దేవదేవికి మీయెడలఁ బూర్ణానురాగము కల దని మీరు చెప్పుటచేత నింతగొడవ చెప్పవలసి వచ్చెను. దాని యనురాగ మెట్లున్న నది మిక్కిలిజాణ. మీరుశృంగారవిద్యలో నింక నోనమాలలోనేయున్నారు. కావున మీకు నావంటివానిసాహాయ్య మావశ్యకము.

మాధ—పురోహితుఁడు లేని వివాహమా? అధ్వర్యుఁడు లేని యజ్ఞమా? చారుఁడు లేని రాజనీతియా? మంత్రసాని లేని ప్రసవమా? వైద్యుఁడు లేని చావా? సంధానకర్త లేని సరసమా? చాలు!

శ్రీ—నీవు పోవయ్యా! మాతో నీ కేంపనులకు?

మాధ—నా సాహాయ్యము లేనిదే మీకు శృంగభంగ మగుట నిశ్చయము. నేను బోయెదను. కాని నా కేమైన నొసఁగుఁడు.

విప్ర—ఇప్పటికు మాయొద్ద నేమి యున్నది?

మాధ—దర్భాసన పుఁగట్టలో నేమో యున్నదే?

శ్రీ—ఏమి యున్న నీకేమి? పోవయ్యా!

మాధ—(తనలో) పీడయొక్క ఘన మున్నది. ముండమోపికొడుకులు నాకీయకున్నారు. నేను ముందు దేవపరితల్లియొద్దకుఁ బోయి యీమాటఁ జెప్పెదను. (పోవును.)

(నేపథ్యమున) స్యూ—! స్యూ—! (కుక్కలు మొఱుఁగును.)

శ్రీ—చూచితిరా! కుక్కలను మనపై నీతఁడు సుసికొల్పుచున్నాఁడు!

(నేపథ్యమున) స్వామీ! కుక్కలు మీదర్భాసనపుఁగట్టనెత్తుకొని పోవును. జాగ్రత్త!

(మఱియొకధ్వనితో) ఓహోహో! అయ్యవారుగులవారు కాఁబోలు! ప్రతివాదిభయంకరులు కాఁబోలు! హేం హేం హేం! రావణసన్యాస మోయి! (చప్పట్లు జరచుచున్నారు.)

(మఱియొకధ్వనితో) రంగదాసు లనంగదాసు లైనారు! ఓహో! ఆచార్యపురుషులు వ్యభిచారిపురుషు లైనారు! వేదమార్గప్రతిష్ఠాపకులు విటమార్గప్రతిష్ఠాపకు లైనారు! తిరుప్పావు కాలక్షేపప్రియులు దేవదాసికొంపలఁ దిరుపతులు వేంచేసినారు. లేవిడి! కొట్టు! కొట్టు!

శ్రీ—మనల వీరు కొట్టుదు రేమో?

విప్ర—వారికి మన మేమియుపకార మొనర్చితిమి? భయము లేదు. కాని, వీరు విటులే—నేను విటుండనే. వీరును స్త్రీవాంఛచే నిటకు వచ్చినవారే—నేను నట్లే వచ్చినవాండనే. వారిచర్యయుం దప్పే—నాచర్యయుం దప్పే. వారు నన్ను దూర నేల? నన్నుం గొట్టుం డన నేల? వారినిలోకు లేల యిట్లు నిందింపం గూడదు? కుక్కలు సహితము నన్నుం గాంచి యేల మొఱుంగ వలయును?

శ్రీ—గీ. విటులత్రిప్రవృత్తి గతు లంత ♦ వెగటుకావు;
గృహిణి గర్భధారిణి యొకి ♦ లింతవలెను
సంగదూర భాగవతుని ♦ జారచర్య
విశ్వనింద్యంబు విధవవే ♦ విళ్లుబోలె.

గీ. సంగయుతుల దుర్గతులు హా ♦ స్యంబు లగునె?
యోగిసుంగోన బాధల పొం ♦ దాటులెల్లు.
పతితసంగులరక్తి న ♦ శ్వాచు నెఱుం
బోడు పంద్యాడం బట్టువెట్టె ♦ మొగ్గములంగు.

గీ. ఎంగిలాకుల నానుం, ♦ రంగనిగుడి
భక్తుం డుంటయె యుచితాత ♦ వాండు గుడి, ని
తంబు పెంటపై నుండ నిం ♦ ద్యంబు గాదె?
యనుచితగతి యెట్లునదూ ♦ ష్యంబు సుమ్ము.

(నేపథ్యమున) సాధనష్టకస్థాపకాచార్యోత్తమా? దాసోస్మి దాసోస్మి!

విప్ర—అదేమి? అదేమి?

శ్రీ—ఏ మున్నది? దేవరవారిమహిమము నెవండో వర్ణించుచున్నాండు. అందఱికి మోక్షోపాయములుగ కర్మ, భక్తి, జ్ఞానము లుండ మన నాథు ప్రపత్తి యని నాలుగవదానిని జేర్చుకొనిరి. వారితరువాతి వారది చాలక యాచార్యాభిమాన మని యైదవదానిని జేర్చు

కొనిరి. దేవదేవారు వ్యభిచారాభినయంబన మను నాట్యపదానినిగూఢ స్థాపించినమహాచార్యపురుషు లని యెవఁడో యనుచున్నాఁడు. (నేపథ్యమున) ఓహో! సామాన్యాచార్యపురుషునివలెఁ గానఁబడుచున్న నీతఁడు నూతనవైష్ణవావతార మోయి! “వందేవిష్ణుపదానందం వాసుదేవం నిరంజనం,, (లెంపలు వైచుకొనుచు) అపరాధుఁడ నపరాధుఁడను.

విప్ర—నేను శ్రీమహావిష్ణునవతారము నని కూడ హేళన మొనర్చుచున్నారా?

శ్రీ—శ్రీమహావిష్ణువు కృష్ణావతారమున గోపికలయిండ్లఁ జేరి వారినుద్ధరించినట్లు మహావిష్ణుఁడు తిరిగి దేవదేవియవతారమును ధరించి సానియిండ్లఁ జేరి వారల నుద్ధరించు నని—

(నేపథ్యమున) ఇదే యిల్లు! ఇదే యిల్లు! లోనికి రండు!

విప్ర—అదిగో! కర్ణామృతముగ దేవదేవిమాట వినఁబడినది.

శ్రీ—అంతటితో నైనదా? శ్రీరంగమూర్తివలె నది మీకు దివ్యదర్శన సేవకూడ నిఁక సాయించును.

(వెనుకఁ దెరయెత్తఁగా నింటిలో దేవదేవి ప్రవేశించును.)

దేవ—దాసురాలు నమస్కరించుచున్నది.

విప్ర—దాసోహం.

దేవ—తుదకు మాకుటీరమును పావనము సేయ దయచేసితిరా?

శ్రీ—(తనలో) పావనమును శ్మశానమును జేసి—

విప్ర—కుటీర మనెద నేమి? ఓ! దివ్యభవనము!

శ్రీ—వైష్ణవమర్యాదచే నట్లనుచున్నది లెండు.

దేవ—తా మీయాసనమున దయచేయుఁడు. శ్రీనివాసా! నీవ్వకూడఁ గూరుచుండుము. (ఇద్దఱు అట్లు సేయుదురు.)

అక్కా! నీమఱఁదిగారు వేంచేసినారు. ఇటు రమ్ము.

వేశ్యమా—అమ్మాయీ! నీవు లోనికిఁ బొమ్ము ఒసే మద్దీ! నీవుపో యిచెల్లెలిని ముద్దులమఱఁదిగారిప్రక్కలోనికి సింగారింపవలదా?

శ్రీ—మాధవా! మధురవాణి ధ్వంసమైకాఁబోలు మద్దిక్రింద దిగినదా!

మాధ—సేతుమాధవుఁడ నైననేను జచ్చుమాదిగను గాలేదా!

వేశ్యమా—ఒసే లోనికిఁ బోక యదేపనిగ నేమి చూచెదవే! ఇఁకఁ దెల్ల వాఱినదాఁక వలపులనుగనిని జూచుకొనక చేసికొనున దేమున్న ది? అబ్బఅబ్బ! బెంగపెట్టుకొనిపోయితివే! నాల్గుజాములు నా లుగేండ్లయిపోయెనే? వచ్చునో రాఁడో! ఏమి పలవరింతలు! పో పో! లోనికిఁబో! కన్నులైనఁ దిన్నఁగఁ దినక నకనక లాడు చున్నావు. నీమగని గనిపెట్టుకొని నేనిక్కడ నుందు నమ్మ! ఈ బంగారపుఁబిచ్చుక నెనతెత్తైనఁ జెంగున మూటఁగట్టుకొని పాఱి పోకుండ నేఁ గాపుండెదను లే. నడు నడు!

దేవ—నేను సెలవు దీసికొని తిరిగి దర్శింతును.

విప్ర—శీఘ్రముగ రావలయును సుమా?

వేశ్యమా—అయ్యో! నాయనా! వలచి వలచి, మురిసిమురిసి, శ్రీరంగ మునుండి తెచ్చుకొనిన శెల్వప్పిళ్లరాయఁడవుకాదా? శీఘ్రముగ రమ్మని చెప్పనేల? మాకాలమునాఁడు మాకుఁగూడ మగ లని ముద్దుమాగ లని, బెదరింపుమగ లని, తేరమగ లని, వెచ్చపుమగ లని, సంతమగ లని, మంచముక్రిందిమగ లని, మాటింటిమగ లని ముద్దినుసుముక్కాలవారు సంక్రమణపుజంగాల వఱకుఁదిరుగుచు నే యుండువారు కాని మాకుమంచము లేకుండ సానితనము చేసిన చచ్చుపెద్దమ్మలము గాముకదా! అయిననేమి? మాకాల ములో నీమమకారములుమాత్రము మేమెఱుఁగ మమ్మా! మీ లాగున మమకారముచేతనే మడఁగిపోవుమాట యుండునె పెల నింతకొంప నెక్కి తొక్కి మీఁదనెట్లు నిలువఁబెట్టఁగలుగుదును?

మాధ—(తనలో) ఉన్న దొక్క టెక్క యన్నమాట సత్యము. రెండ వది కొయ్యచేయి.

దేవ—అమ్మా! ఒక్క ఓసోది చదువకు.

వేశ్యమా—(అపవారించి) నే నెఱుంగుదు నమ్మా! నీ కిది పోదిలాగు న నేయుండు నమ్మా! కడుపునిండినను గంజు కంటంబడినప్పుడు కడు పునఁగన్నతల్లి మంటఁ బడవలసిన దని నే నెఱుఁగ నమ్మా! కా సంతయున్నఁ గస్సుమనెదవు కాని ఒసే! నేనుదెచ్చినదేదో దిగ పీఁకుటయే కాదా మీప్రయోజకత్వములు! పట్టుమని యొక్క సంసారమును మాపఁ గలిగితివా? ఒక్క కొంప దిబ్బచేసితివా? మందుఁ బెట్టి యొక్క ముండకొడుకునకు వెఱ్ఱి లెత్తించితివా? ఎంతసేపు సరసులవెంట నీవు తిరుగుటే సరిపోయెను. ఇఁక సాని తన మేమిటి? నాశ్రాద్ధమా? మనుకారములతో నొడలు నింపు నా? ఇల్లునింపునా? నూఱుముద్దులు పంట్రెండి యొక్క పోఁక బద్దవిలువ చేయవు. గంపెఁడు కౌఁగిలింత లొక్క కంబళిపాత విలువ చేయవు. ప్రేమంటఁట! పొలయల్క లంటఁట! విరహవేదన లంటఁట! నాపిండకూడంటఁట! నల్లమునగంటఁట!

మాధ—అమ్మా! వేశ్యామాతగారూ!

శ్రీ—(తనలో) శాస్త్రులగారు, రాజుగారు, పంతులుగారు, అని బిరుదములను బహించి సంబోధించినట్లు వేశ్యమాతగారూ! యని పిలుచుచున్నాఁ డేమి?

వేశ్యమా—ఎందులకోయి! మాదిగసందగారూ!

మాధ—నీవు దేవదేవిని గూకలుపెట్టకుము చిన్నతనము.

వేశ్యమా—చిన్నతనముకావుననే యేడ్చుచున్నాను. అది గాక సాని దానిసౌఖ్యపుబ్రదుకనఁగ నెన్నోనాళ్లా? వేసవియమితముగఁగాచి యుడుకువాన లారంభించువెంటనే కలుగువిసూచిరోగప్రుంద

పాతపావలె నది నాలుగుమాసము లుండుసరికి మహాకష్టము.
ఆసమయములో నేయుంకినంతవట్టున కందరితలలు గొట్టవలయును!
ఆపుణ్యకాలము దాటిపోయినతరువాత సానియమ్మవారియింటి
లోను, జామలమ్మవారిగుళ్లోను, నిఁక ధూపదీపనైవేద్యము లి
ద్దఱకు సున్నయే.

మాధ—దేవదేవిమాత్ర మూరకున్న దేది? నిత్యపవిత్రాచార్యులవారిని
దెచ్చికొన్న దికదా! ఇంతటినుండి దానిప్రతిభ! దానిసంపాదన!

వేశ్యమా—ఆలాగున నంటివి. బాగుగ నున్నది. మానాయన! మా
తండ్రి! మామొహరీలరాయఁడు! ఇదిగో! ఇక్కడనుండి దేవ
దేవి తేలవలయును. ఇక్కడనుండి యేదో—పూసయ
ని, పుట్ట యని, గుళ్లని, గుట్ట యని, కాసని, కట్ట యని, నగ
యని, నట్ట యని, గుడ్డని, గుట్ట యని, అవిక యని, ఊట్ట య
ని, మేడ యని, మెట్ట యని, భూమి యని, బుట్ట యని,—

మాధ—(తనలో) మా కుపయోగించెడుప్రతివస్తువునొకనిరుప
యోగమైనయవస్తువునుగూడ సంధించినది. పిట్టుఁ గైనగురువు
తో శుద్ధనిరుపయోగనిర్భాగ్యుఁ డైనయాశిష్యుఁ డున్నట్లు—

శ్రీ—(తనలో) ఓసి! నీయిల్లు వల్లకాడుగాను. చావునను సిద్ధమైనముం
డవు సంయుక్తాక్షరము లెంతస్పష్టముగఁ బలికితివే. వస్తువునకొ
క్కొక్క వట్టవొప్పునఁ బెట్టుకొని వచ్చితివి. నీగొంతుకఁ గో
య! మా కిచ్చుటకు మాయొద్ద నేమున్నది? మా కున్నసర్వస్వ
ము దర్భాసనము—దట్ట—పైత్రాడు—తట్ట—లోనమడిపం
చ—మట్ట.

దేవ—అయ్యా! పోయెదను. అక్కా! రమ్మా. (ఇద్దఱు పోవుదురు.)

వేశ్యమా—నాబాబునొద్ద నేను గూరుచుండెదను. మాదన్నా! నీవ
చ్చటఁ గూరుచుండుము.

శ్రీ—(తనలో) అగ్ని ప్రశాంతినొందుటవలనఁ గదా మెలుగుబంటి యీకట్టె నిట్టె సమీపించినది.

వేశ్యమా—అల్లుఁడని యడఁగి యత్తగారికి నమస్కరించుటకు, నత్తగారని యూప్యాయనముగ నల్లు నాశీర్వదించుటకు—నంటి ముట్టరాని—అగ్రకులములోఁ బుట్టితివికదా! మన కింక ముద్దుముచ్చట లెట్లు తీరును?

మాధ—(తనలో) ముదుపులలో—

శ్రీ—(తనలో) నాకు మరణము సిద్ధించునెడల నీసమయమున మహాధన్యాత్ముఁడ నగుదును. ఈమాటలు వినలేకుండ నున్నాను. శ్రీరంగదేవునికిఁ దప్ప దేవతాంతరమునకే చేయి మోడ్పనియీ మహానుభావుఁ డీముదిముండకు మ్రొక్కుఁ దగునఁట! ఆహా! కాలవిపర్యయము! (లెంపలు వైచుకొనును.)

వేశ్యమా—నాయనా! నీస్వేచ్ఛావృత్తి కభ్యంతరము సేయఁగల తల్లిదండ్రులు నీకున్నారా?

విప్ర—లేరు.

వేశ్యమా—సంతోషమే. అదృష్టవంతుఁడవు. నాయనా!

శ్రీ—(తనలో) తనకుఁ దల్లియుఁ దండ్రియు నైనశ్రీరంగమూర్తి నే లేఁడనుచున్నాఁడు.

వేశ్యమా—పాలిపంపులకు భ్రాతలుకూడ—ఊఁ?

విప్ర—లేరు.

వేశ్యమా—చెప్పినమాట విని, మఱియొకచోటికిఁ బోక—నిక్షేపము వంటిసొత్తును—గాడిదగత్తర కానీక—చూడు!—తోఁట, దొడ్డి కున్నపాయ లేమో పత్రా లేమో! ఇప్పటి కున్న పిల్లికూన లేమో! అవి యన్నియుఁ దెచ్చికొని—అమ్మాయిగదిలో—ఊఁ. నీపెట్టెలో నే—మా కొక్కపైస యక్కఱ లేదు. నాయనా!

ఆదీపముతోడు! మాసంపాదితములే మాకుసమృద్ధి! కుట్టుడి! పట్టిపెట్టుడి! రసపూర్ణతలో — నాయనోయి! చూడు! — లేఁత ముంజెకాయవంటిది. మావస్తువు మంచిదైనప్పుడు మాకెన్నఁటికిఁ గొదువ లేదు. కాని, ఈమణిపూసకు నీవు మగఁడగుట కంటెను మహాదృష్టములేదు. చక్రవర్తులకుఁ దగినది. మనకుఁ బెద్దపరుగు లేల? నాయనా! మీ కేయేగ్రామములలో నెంత లెంతవసతు లున్నవి?

విప్ర — ఎక్కడను లేవు.

మాధ — (అపవారించి) అసత్యము — నమ్మకుము.

వేశ్యమా — మాదిగా! అల్లుఁడుగారి కొక్క టేసిగ్గు —

శ్రీ — (తనలో) అది లేకపోవుటచేతనే యిచ్చట నున్నాఁడు.

మాధ — సిగ్గుకా దమ్మా!

వేశ్యమా — కాకపోయినయెడల భూము లెక్కడ నున్నవో తెలిసినంతమాత్రమున నంతసొత్తు నెత్తుకొని పాఱిపోవుదు మని భయమా!

విప్ర — అట్టిసంకోచము లేవియు లేవు.

శ్రీ — (తనలో) ఉన్నసొత్తెల్ల రంగభక్తి. అది దేవదేవి హరించుకొని పాఱిపోయినది.

వేశ్యమా — శ్రీరంగములో గొప్పతోఁట మీకున్నట్లు నేను వింటిని గదా! ఏల చెప్పకపోయితివి? అల్లుఁ డత్తగారియొద్ద నసత్యము లాడవచ్చును గాఁబోలు! అందులకొఱకే కత్తిగా రల్లునిబుగ్గపై హాస్యమున కట్టె పోటువచ్చును గాఁబోలు!

(పోటువఁబోవును.)

శ్రీ — ఆఁగు! ఆఁగు! అది యేమిపని?

వేశ్యమా—ఓసీ! ఇదేమి వింత? చాలు చాలు! ఎవఁడైన నవ్వుకొని పోవును. అబ్బ! దైవముఖమును జూచి తగినవానికిఁ జేతులార సాలంకారకన్యాదానము చేసికొనినయత్తగారికి కూడ మూట మోసికొనివచ్చినసీకున్నమాత్రపుస్వాతంత్ర్యము లేదా? (దగ్గ అగఁబరిశీలించి, అపవారించి) మాదా! ఇదేమో! సుద్దులోను జేగురులోను బరజాలువేసినగోడవలె నీతఁ డున్నాఁడేమోయి!

మాధ—(అపవారించి) భాగవతోత్తముఁ డని చెప్పలేదా?

వేశ్యమా—(అపవారించి) భాగవతోత్తముఁ డని నీవనఁగ భామాకలాపమో, జలక్రీడలో యాడఁదగినవేషధారి యనుకొంటిని. ఉన్న బండార మీపట్టెవర్ధనము లేనా యేమి? ఒడలినిండ నట్టకట్టులవలె నీబొ ట్లేమి?

మాధ—(అపవారించి) అసాంప్రదాయముగ బొట్లనఁగూడదు. తిరుమణి కా పమ్మా!

వేశ్యమా—(అపవారించి) నీతిరుమణికాపు తీర్థముబోను. చెమ్మకాయ లవలె, లాంతరుచట్రములవలె, మూఁడుకొయ్యల యోడలవలె నిట్టిభయంకరము లగుపంగనామా లేమిటోయిబాబూ! ఈత నికియథార్థముగ నెంతసొమ్మున్నదో కనుఁగొనవలయును.

మాధ—అయ్యా! శ్రీరంగములో నున్నతోఁట మీదగునో కాదో యత్తగారితో మనవి చేయక పోయితిరి.

విప్ర—అది నాదే.

వేశ్యమా—నాయన! నాతోఁటలరాయఁడు! నాబంగారుతండ్రీ! అందు లోనిఫలవృక్షములవలన నెంతరాఁబడి?

విప్ర—ఫలవృక్షము లేమియు లేవు.

వేశ్యమా—ఆఁ! ఆఁ! అదేమి?

విప్ర—పూలచెట్లు కొన్ని యున్నవి.

వేశ్యమా—పూలచెట్లల? స్వాలంకారమునకా?

మాధ—(అపవారించి) శవాలంకారమునకు.

వేశ్యమా—ఆభూమిని విక్రయించినయెడల నేమి వచ్చును?

విప్ర—అది నాసొంతము కాదు. దేవస్థానపుజారియొద్ద బాడిగకుఁ దీసికొంటిని.

వేశ్యమా—చీ! చీ! పోనీ! చరరూపకమైనసొత్తేమైన నున్నదా?

విప్ర—ఏమియు లేదు.

వేశ్యమా—నాతోడే?

శ్రీ—(తనలో) రంగపాదాలు పోయి వేశ్యపాదాలతో డఁవలసివచ్చినది. మహాదుర్గతి!

విప్ర—ఏమియు లేదు.

వేశ్యమా—చేతిలో చిన్నకాసైన నున్నప్పుడుగదా ప్రక్కలోనికి సాని?

మాధ—నిజమే! అక్షరమునకు నెత్తిపై నేత్వమున్నప్పుడుకదా క్రిందివైత్వము?

వేశ్యమా—ఔనయ్యా! దాసరయ్యా! ఏమున్న దని నీ విచ్చటకు వచ్చితివి?

శ్రీ—(తనలో) రంగరంగా!

విప్ర—దేవదేవికి నాపై మహానురాగ మున్న దని వచ్చితిని.

వేశ్యమా—ఇదియా నీకున్నసొమ్ము. ఇన్ని పంగనామాలమంగలికత్తులతో మాబుట్టలుగొఱుగుటకు వేంచేసినతిరుమంగలియాళ్వారనా? నాయనా? నడు! నడు!

శ్రీ—(తనలో) రంగరంగరంగా! ఎంతమాట వినవలసివచ్చెను! (అపవారించి) స్వామీ! పోవుదము రండు.

వేశ్యమా—(అపవారించి) మాధవా! నేను బోయెదను. ఈదర్భాసన పుగట్టను నీవు తస్కరించుకొని రావలయును.

మాధ—సందేహమా? ఎంతదొంగకిన నంతయే యగును.

వేశ్యమా—మాదా! ఈముష్టిపెద్దమ్మలను గుమ్మములోనికి రాకుండఁ గుక్కలనుగొట్టినట్లు కొట్టుము. నేను పోయెదను.

(వేశ్యమాతనిష్క్రమించును.)

మాధ—అయ్యా! గురువుగారూ! నామాట విని యీముసలిముండ కేమైన నిచ్చినయెడల మీకు సర్వకార్యదిగ్విజయము కరతలామలకము. మీరు విద్వాంసులు. వేశ్యావీథిమర్యాద లెఱుఁగనివారా? ఏల మీరుపేక్షించిరో తెలియకున్నది.

విప్ర—ఉపేక్ష కాదు. ధనాభావము.

మాధ—నిజముగ?

విప్ర—ఆ!

మాధ—అటులైన మీరీవీథికి రాఁదగదు. దానములకు, దక్షిణలకు సంభావనలకు, సంతర్పణలకు నిది యేమి యజ్ఞవాటియా? అయ్యయ్యో! మాసవేతనములకు, వార్షికములకు, వస్త్రబహూకృతులకు, ధనసత్కారముల కిదియేమి రాజసభ యనుకొంటిరా? అయ్యయ్యో! బందిపోటుదొంగలమఠమున కేల వచ్చితిరి?

విప్ర—వారిభయము మాకేమి? వారు హరించునది మాయొద్ద నేమున్నది?

మాధ—సరి సరి! అటులైన ధనాగమమునకుఁ గొంతఁ బ్రయత్నించుటమీ కిష్టమా?

విప్ర—ఏమందువు? శ్రీనివాసా!

శ్రీ—మీ యిష్ట మెట్లో య ట్లాచరింపుఁడు. అయినను—

విప్ర—ఏప్రయత్నము చేయు మని నీయభిప్రాయ మయ్యా!

మాధ—అయ్యా! శ్రీనివాసుఁడు దుప్పివలె నున్నాఁడు. నేను గసిగవ లెనున్నాను. మీకు దేహబలము, దైవబలము కూడ నున్నది. ఊరుమాటుమడఁగినది. చీఁకటిరాత్రి—

విప్ర—ఇఁకఁ జెప్పకుము.

మాధ—వల దనుచున్నారు కాని యింతకంటె సద్యఃఫలద మైనప్రయత్నము మఱియొకటి లేదు. దీనితరువాతిప్రయత్నము చెప్పనా?

విప్ర—వలదు.

శ్రీ—వల దందు రేల? చెప్పనిండు.

మాధ—మీరు సంపూర్ణపండితులు. స్వరూపగ్రంథములలో నిధులు. మంచి వైదికజ్ఞానసంపన్నులు. అది గాక, కాసీయకుండ వెలయాలిని వశపఱుచుకొనుటకుఁ దగినంతలౌకికజ్ఞానమున నసమానులు. మీ రొక్క గ్రంథమును రచియించినయెడల గాగరా[illegible] నభోగముముండచేతఁ దలకొక్క గ్రంథమును గొనిపించి మీ[illegible] గావలసినంతధనముఁ జేర్తును. స్వతంత్రజీవనోపాధు[illegible] న్నము చేయుటతరువాత గ్రంథకర్తృత్వమే యూరివా[illegible]ధన[illegible] ను హరించుట కుత్తమమైనది.

విప్ర—ఏగ్రంథ మొనర్చు మని మీయభిప్రాయము?

మాధ—అటు లడుగుఁడు. చెప్పెదను. లౌకికవైదికసాంప్రదాయ[illegible] ననిష్ణేవు లగుమీరు కళాశాస్త్రమునకు విశిష్టాద్వైతభాష్య గ్రంథమును రచించినయెడల—

విప్ర—అయ్యా! దాసునిఁ గటాక్షించి వదలిపెట్టుఁడు.

మాధ—మీ రిక్కడ వీథియరఁగుమీఁదఁ జీఁకటిలో నుండెదుగునా? మాయింటికి రండు.

విప్ర—క్షమింపుఁడు. మే మిచ్చటనే యుందుము.

మాధ—దేవదేవి తిరిగి యిచ్చటకు వచ్చునను నాస మీ కేమైన నున్నదా?

విప్ర—ఏమైనఁ గాదు. కావలసినంత—

శ్రీ—(అపవారించి) ఊడినయెడల నతిసంగతి యెఱిఁగియుండియు నతనితోఁ జెప్పకుంటయ్యా?

మాధ—ఏమి మీ కీవెఱ్ఱి?

విప్ర—నా వెఱ్ఱికంటె దాని వెఱ్ఱి హెచ్చు—దానిహృద్వైఖరి నే నెఱుఁగుదును. ఈముసలియాయనకుఁ గొంత భయముండినను రాక మానును. ఆమె నన్నే విడుచునా? ఆమెవలన నాభక్తి చెడెను. నావలన నామెభక్తి చెడెను. ఇట్లు మన్యోన్యకారణమున భ్రష్టతను బొందితిమి. మా కిద్దఱి కొక్కటే యంతఃకరణవృత్తి. ఒక్కటే గతి. శ్రీనివాసా! నీయభిప్రాయ మేమి?

శ్రీ—నాకు మతి లేదు. నన్నేమియు నడుగకుండు.

మాధ—అది రసయుక్తహృదయ యనుమాట నిశ్చయము.

విప్ర—రసయుక్తహృదయ యని సామాన్యముగ ననెద వేమి? సంపూర్ణరసయుక్తహృదయ. దానిహృదయ మట్టిదే కానియెడల నేనట్టులై యుందునా? రాకపోవుటయే! ఎంతమాట— శ్రీనివాసా! కాలిచప్పుడగుచున్నది మామా!

శ్రీ—కాలిచప్పుడు కాదయ్యా! గాలిచప్పుడు. అదిగాక నేను జూచున దెక్కడ? తలుపు వేసియే యున్నది.

మాధ—ఆమె వచ్చునెడల నీద్వారముగుండ రాదు. ఈప్రక్కతెరువు లోఁదొడ్డిగుమ్మ మున్నది. అది నీకుఁ జూపించెదను. నాతో వచ్చెదవా?

శ్రీ—అంతయావశ్యకత యిప్పుడు లేదు.

విప్ర—శ్రీనివాసా! లేదందు వేల?

మధు—(ప్రవేశించి) నాకు నిద్ర వచ్చుచున్న దని చెప్పిన వినక తిరిగి యిప్పు డిక్కడకెందులకుఁ బిలిచితివి? అది గాక నీభర్తతో నా యెదుటఁ జెప్పవలసినమాట లేమి యున్నవి?

దేవ—రమ్మా. ఎట్టిమాటలఁ జెప్పెదనో.

మధు—నా కాతని జూడ సిగ్గమ్మా!

దేవ—నేనుగూడ నుందును గాదా రమ్మా (గుమ్మమునొద్దకుఁ బోయి) హా! ఇది యేమి? ఆమహానుభావుఁ డేఁడీ? ఏఁడీ! ఎటకుఁ బోయెనో?

మధు—అమ్మ భర్తురా లంటివికాదా? అమ్మచేసినపనియే యిదియై యుండును. ధనశూన్యముగ రానేల యని యేమిదుర్భాష లాడ సహింపలేక యాతఁ డెటకైనఁ బోయెనేమో? పాపము! నీకు మిక్కిలి సంతాపకరముగ నున్నది కాఁబోలు!

దేవ—నాకు సంతాపము లేదు. సంతోషము లేదు. ఆతని జూడవలసిన యావశ్యకత స్వల్పముగఁ గలిగి వచ్చితిని.

మధు—నాయెదుట నీ నాతనితో నాడవలసినమాట లున్న వని చెప్పితివి. అవి యేమి? అది గాక, మనసమయము ననుసరించి నా దాస్యమునకు నీ వేల యంగీకరింప కున్నావు?

దేవ—నాకు నీదాస్య మక్కఱ లేదు. నీ వక్కఱ లేదు. మీయమ్మ యక్కఱ లేదు. ధన మక్కఱ లేదు. ఏమియు నక్కఱ లేదు. ఈయంశములు నీతోఁ జెప్ప రమ్మంటిని.

మధు—అమ్మ తెలివితక్కువచేత నట్లు జరిగినది. ఆమహానుభావుఁడే తిరిగి వచ్చును.

దేవ—నా కాతఁ డక్కఱ లేదు. ఈవేశ్యావృత్తితోడనే పని లేదు. (నగలూడిచి) ఈదౌర్భాగ్యపుసొమ్ములతో నాకుఁ బని లేదు. (పాఱవైచును.)

మధు—అయ్యయ్యో! ఇది యేమి? విప్రనారాయణునితోఁ గొంత యావశ్యకత గలిగి వచ్చితి నంటివే?

దేవ—ఔను. ఇక్కడ నున్న యెడల మాట లాడఁ దలఁచినాను. మాట లనఁగ నేమున్నవి! అతనితో నాతప్పు నొప్పుకొని క్షమించుమని గోరఁ దలఁచితిని. లేదు. అతనిదారి యతనిది. నాదారి నాది.

మధు—చెల్లెలా! అట్లందు వేల? ఏమో గోజుచున్నా వేమి?

దేవ—ప్రపంచమున నిదివఱకుఁ బుట్టినవేశ్య లందఱు తమయావజ్జీవములలో సంపాదించుకొనినమహాపాపముకంటె సహస్రాంశము లధికమైనపాపమును నే నొక్కతె నొక్కయాఱుమాసములలో సంపాదించుకొంటిని. అందులకు నాకుఁ జింత లేదు. జరిగి పోయినది. చింత పడిన వినియోగము లేదు.

మధు—కాని యిప్పుడు నీ వేమందువు?

దేవ—చెప్ప లేదా? నాకుఁ బ్రాపంచికసంబంధ మేమియు నక్కఱలేదు.

మధు—మహాభక్తుఁ డైనవానిని సంపూర్ణభ్రష్టుని జేసి యాతని నిప్పుడు విడిచిపెట్ట న్యాయమా?

దేవ—అతఁడు సంపూర్ణభ్రష్టుఁడు కాలేదు. చేయుటకు నాతరము కాలేదు.

మధు—నాకుఁ దెలియనిమాటలఁ జెప్పుచున్నావు.

దేవ—విప్పి చెప్పెదను వినుము. ఎన్నరానిలంజెవేసములు వేసి యాతనిని మడిగదిలోనికిఁ దీసికొని పోయితిని.

మధు—తరువాత—

దేవ—ఆయనబ్రహ్మచర్యవ్రతమునకు భంగము కలుగఁజేయవలయు ననుదురుద్దేశముతోఁ గౌఁగిలించుకొనుసరికి నాయొడ లాపాదమస్తకము భగ్గుభగ్గున నిప్పులతోఁ గాల్చినట్లు మాడిపోయెను. నిలు

ఫువ నట్లు కాలిపోవుచుంటి ననుమహాభయముచే నేనుండఁ జేతులు తమంత తామె పట్టు వదలి పోయెను. వెంటనే యొక్క లిమూట చల్లారెను.

మధు—ఏమి వింతగ నున్నది?

దేవ—నుచకిది వింత గాని, దాస్యహ తేజస్సంపన్ను లైనభక్తుల కది వింత కాదు. అంతకు ముం దనేకపర్యాయములాతని స్పృశించితిని గాని యట్టియవస్థనాకుఁ గలుగ లేదు. ఆతఁ డప్పటికిఁ గొంతభక్తిచ్యుతిగలవాఁ డయ్యెను రంగఁ డాతనిని—నీవు చెప్పినట్లు—సంపూర్ణభ్రష్టుఁడు కాకుండ రక్షించినాఁడు. అంతట నా కేమియుఁ దోఁచక బాహ్యస్మృతిఁ జెడిపోయినమతితో నిల్లు సేరితిని.

మధు—అందుచేతనా వచ్చినప్పటినుండియు నేమో వెఱ్ఱిదానివలె నుంటివి? విప్రనారాయణవిరహముచే నట్లుంటి వని యనుకొంటిమి!

దేవ—అది మీవెఱ్ఱి—శ్రీరంగము వ్రాయు యాతనిని నాయింటికిఁ దోడితెత్తు నని యాతనిమహావాంఛ యైన మాటవరుస కంటిని. అట్లు నేను బోవపోవుటఁ జూచి యాతఁడే యిచ్చటకు వచ్చినాఁడు.

మధు—బ్రహ్మహత్యఁ దెచ్చుకొంటిమి కదా? మనపంచలఁ బడి దేవులాడుచు బ్రాహ్మణు నిప్పు డేమిచేయవలసినది?

దేవ—మనమా చేయవలసినది! అజ్ఞానము—వేశ్యాకులమునఁ బుట్టి తరతరములనుండి వచ్చుచున్న పాపగంధవిషసంపర్కమును రక్తము సంపూర్ణముగఁ గలిగి పెద్దదాన నైనది మొదలు నిరంకుశముగ వ్యభిచారమొనర్చినసేనే భక్తుని సంపూర్ణసంస్పర్శచే—అది యొక్కనిమిష—కాని యథార్థముగ నీవు చెప్పినట్లు దైవేచ్ఛచే—ప్రాపంచికసుఖవిరాగిని నై—భక్త్యంకురసహితహృదయ నై

యున్నప్పుడు—మహాత్ముఁడు, పరమభక్తుఁడు, లింగభేదమే యెఱుఁగనిరంగదాసుఁడు, ఆహా, దైవసముఁడు—అట్టి లోకోత్తరుఁ డొక్కసారి—పురాకృతపాపలేశమున వేశ్యావీథికి రాఁగ-ఇఁక నంతయేనా? తిరిగి భక్తుఁడు కాఁడా? అందులకు మన మేమి చేయవలసియున్న దనుచుంటివా? ఎంతమాట! తల గిఱ్ఱున దిరిగి, దేహ మపరశమై, పడిపోవుచుఁ గ్రుంగినప్పుడైన, నేలఁ బడకుండ నాతనిని రంగఁ డుద్ధరించినాఁడే? ఇప్పుడా రంగఁ డెక్కడకుఁ బోవును? ఆతనినిగూర్చి నీకు విచార మక్కఱ లేదు. నన్నుఁ గూర్చి యంతకంటె నక్కఱ లేదు. నేనుఁ బోయెదను. నమస్కారము.

మధు—ఎక్కడకు? తిరుగ విప్రనారాయణునియొద్దకుఁ బోయెదవా?

దేవ—అయ్యయ్యో! ఒకనితో నాకు లేశమైన నిమిత్తము లేదని చెప్పఁ దిరిగియట్లడుగుదు వేల? విప్రనారాయణునితో నా కేమి? నాతో నాతని కేమి? నా కొక్క శ్రీమహావిష్ణువుతోఁ దప్ప నితరవస్తువుతోఁ బని లేదు.

మధు—నీ విట్లు పోయితి వని తెలిసినయెడల నమ్మ బెంగపెట్టుకొని చచ్చిపోవు నేమో?

దేవ—అమ్మ పోయినయెడల జగత్తంత మగు ననియా నీయభిప్రాయము? అట్లయినమాత్ర మేమి?

మధు—అయినను దొందర పడక యాలోచించుకొనుము.

దేవ—ఆలోచించినయాఁడుదాని కధోగతియే. పోవుచున్నాను. (తనలో) దక్షిణమున సారనారాయణ మనుదివ్యక్షేత్ర మున్నది. అచ్చటఁ జేరి విష్ణుదాస్య మొనర్చుకొందును.

(దేవదేవి పోవును.)

మధు—అయ్యయ్యో! పోవు చున్నది. ఇఁక నాఁగదు. ఆహా! భక్తి యందున్న విశేష మెంత! దొంగభక్తి నాలుమాసములు దేచ్చుకొనుసరికి సత్యమైనభక్తి కుదిరినది. ఆహా! ఆహా! ఇంటి కొక్కటైనై పోయితిని. దేవదేవి యెక్కడకో భక్త్యావేశమున నిల్లు విడిచి పోయిన దని నేను మాయమ్మతోఁ జెప్పను. విప్రనారాయణుఁడు దన కేమితోఁదర యిచ్చునో యనుభయమున సమీపమున నున్నపినతల్లిగారిగ్రామమునకుఁ బోయె నని చెప్పెదను. హా! విప్రనారాయణా! ఎంతపనిఁ జేసితివయ్యా! ఎక్కడనుంటి వయ్యా!

(నిష్క్రమించును.)

ఇది పంచమాంకము.



శ్రీ

# విప్రనారాయణచరిత్రము.

## షష్ఠాంకము.

[ప్రదేశము—వేశ్యావీథి]

(ప్రవేశము—విప్రనారాయణుఁడు, శ్రీనివాసుఁడు.)

విప్ర—ఈసారి యేకారణముచేత లోనికిఁ బోవచ్చు నంటివా?

శ్రీ—అది కారణ మంటిని గాని పోవచ్చు నని చెప్పలేదు. వేశ్యామాతకు దూత నని యాతఁడు చెప్పలేదా? ఆతఁడే మనసంచి హరించినాఁడు. అందువలన నిర్భీతిగా లోనికిఁ బోయి యామెం డను బెదరింపవచ్చు నని యుంటిని. సంచికొఱకు నే నేడ్చుచుండఁగ సానికొఱకు మీరు వాంఛించుచున్నారు.

విప్ర—సరే. "దేవదేవి," యని పిలువుము.

శ్రీ—దేవదేవీ! దేవదేవీ!

(నేపథ్యమున) ఓసే! పెద్దీ! జంగమునూకాలయ్యగారు కాఁబోలు! తలుపు తీయుము.

(మఱియొకధ్వనితో) ఎవఁడైన సరియే నే నిప్పుడు తీయుటకు వీలు లేదు.

వేశ్యమా—(తలుపు తీసి) నాయనా! నాకు దగ్గునకు భూతపిల్లిగడ్డ తెచ్చిపెట్టెద నంటివి. తెచ్చితివా?

శ్రీ—నేను శ్రీనివాసుఁడను.

వేశ్యమా—నాతండ్రే! శిష్టుకరణాల శ్రీనివాసంగారా? చూచు! మీరాత్మమెడలోఁ బట్టెడ నంకించుకొనియే వచ్చితివి గదా! నాయనే! ఏదీ?

శ్రీ—(అపవారించి) అయ్యో! ఇక్కడకు దేవదేవి కీర్ద్రమైనాను. వింటివా? అడిగినకొలఁది నింక నొదలు బయలుదేరునుగో! బ్రహ్మచారిణి యని మీయభిప్రాయము. (ప్రకాశముగ) నేను శిష్టుకరణమును గాను. విప్రనారాయణునిశిష్యుఁడను. వీదేమాగురువుగారు.

వేశ్యమా—ఏఁడీ? మీగురువు. జుట్టు పాయఁదీసి తన్నెదను. నిన్నను బొమ్మని చెప్పినను సిగ్గులేక తిరిగి యేల వచ్చినాఁడు?

విప్ర—మాసంచిని నీదూత మాధవుఁడు హరించుటచేత నీతోఁ జెప్ప వచ్చితిమి! (మాధవుఁడు ప్రవేశించును.)

మాధ—దొంగముండకొడుక! నీసంచిని నేను హరించితి నంటరా? నీ బ్రదుకునకు సంచికూడనా? సంచి యున్న యెడల సందెబిచ్చమైన నెత్తుకొందువు కాని తేరసరసమునకు వత్తువా?

వేశ్యమా—దాసరిముండకొడుక! త్రిశూలములవలె, నుదికంబములవలె పట్టెనామములుపెట్టి సిద్ధమైతివా? నీసుద్దబద్దెలు చూచి నిన్ను వాడసాను లిట్టె యిట్టె ముద్దువెట్టుకొందు రనుకొంటివి కాఁబోలు! మొద్దుముండకొడుక! నీజేగురుడాగులు చూచి బోగముముండ లందఱురాగమొందెద రనుకొంటివి కాఁబోలు! బైరాగిముండకొడుక!

శ్రీ—రంగరంగరంగా! (చెవులు మూసికొనును.)

మాధ—ఆతనిస్థైర్య మది కాదమ్మా! అమ్మవిడిచినయాఁబోతు పొవుల మందపై నిరంకుశముగఁ బడినట్లు శంఖచక్రచిహ్నితుఁ డైన

యీరాతఁడు సానివసుమలపైఁ దేరతేరఁగఁ బాపట కథకారము న్నదని యనుకొనుచున్నాఁడు.

వేశ్యమా—ఊరివారికొంపలు మేముదీయుచుండ మాకొంపలుగూల్పవచ్చితివా? ఊరివారిరక్తమాంసములు మేమనుభవించుచుండ మారక్తమాంసములు నీపొట్టఁబెట్టుకో వచ్చితివా? ఛీఛీ! అక్రోసుతాయిలాగున మొగము నీవు! నడు! నడు!

మాధ—వట్టియక్రోసుతాయి కాదమ్మా! నాలుగవయంకె వేసినయక్రోసుతాయి యనునెడల కేవలము పాడుమొగము కాకుండఁ బాగనామముకూడఁ గొంత పడును.

వేశ్యమా—పోకపోయిన యెడల చీఁకలితోఁ బొడుతును.

శ్రీ—మాటలతోఁ బని లేదు. మాసంచి మాకిమ్ము. పోయెదము.

వేశ్యమా—మీసంచి యెక్కడ?

విప్ర—మాధవా! ఇదివఱకు నీతలక్రిందఁ బెట్టికొనినది మాసంచి కాదా?

వేశ్యమా—నాదిగా! నీకాలి జోడడీ? (తీసికొని) నీసంచి నామగనితలక్రింద, నామగనిపాదరక్ష నీతలపైని—(నెత్తిపైఁగొట్టుచున్నది)

విప్ర—రంగరంగరంగా! కావేరిరంగా! కస్తూరిరంగా! దయచేసితివా? తిరిగి నాకంటఁ బడితివా? నీ కిప్పటికి నాయందుఁ గరుణ కలిగినదా? నాకష్టము లింకఁ దొలఁగినవా? నాయనా! తండ్రీ! రంగయ్యా! రంగయ్యా! ఓహో! ఎంతకాలమునకు నీదివ్యదర్శనమిచ్చితివి! అపరాధుఁడను; దుర్మార్గుఁడను; భక్తవత్సలా! పరమపురుషా! దీనదయాళూ! సంసారోత్తారకా! నీలమేఘాంగా! రంగా! రంగా!

(క్రిందఁ బడును.)

శ్రీ—స్వామీ! స్వామీ! ఏమి యిది!

వేశ్యమా—రంగరంగా యనుచు గావుకేకల నైచి యట్లయ్యవారిగాఁడు కొయ్యవారినాఁ డేమి?

మాధ—నీచెప్పుదెబ్బతోఁ గపాలమోక్షమై, విటజన్మము వదలి భక్తజన్మము వచ్చినది.

వేశ్యమా—(అపవారించి) చచ్చు నేమో? నక్షత్రము మంచి దగునో కాదో! అరఁగుక్రిందనుండి యీడ్చి వేయుము.

శ్రీ—స్వామీ! స్వామీ! లేవరా?

మాధ—(అపవారించి) మన మిక్కడ నుండక లోనికిఁ బోవుదము రమ్ము. ఈతఁడు చచ్చినయెడల మన కేమిప్రమాదమో? ఈసంచిలోనిసొత్తును కపేక్షించియీతని జావితి మందు రేమో? ఈ సంచి వానిపైఁ బాఱవేయుదమా?

వేశ్యమా—(అపవారించి) వాఁడు చచ్చిన సరే. నీవు చచ్చిన సరే. నే నందులకొప్పుకొనను. రా! లోనికి రా!

మాధ—(అప) చచ్చినయెడల శ్రీచూర్ణపరిపాలనమునకైనఁ బనికివచ్చును. తిరుమణిపెట్టయైనఁ బాఱవేయుము.

వేశ్యమా—(అపవారించి) ఇది చుట్టలు పెట్టుకొనుట కెంతసొగసుగ నున్నదనుకొన్నావు. రా! లేకున్న నిన్నుఁ దన్నెదను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

విప్ర—అయ్యయ్యో! అయ్యో! మృదుల మైనపాదమే. శిరీషపల్లవసల్లలిత మైన పాదమే—పరమమంగళరేఖాసంపూర్ణాతికోమల మైనపాదమే. అరుణారుణలలితలలిత మైనపాదమే—శ్రీదేవీకరపల్లవపరామర్శనార్హ మైనపాదమే! శంఖచక్రచిహ్నిత మైనపాదమే. ముద్దులు మూటగట్టుపాదమే—ప్రబలసంసారసముద్రోత్తారకసాధన మైనపాదమే—గంగామకరందస్యందనసుందరారవింద మైనపాదమే—అట్టిపాదమే—నాకుఁ బ్రాణపద మైనపా

దమే. నాతండ్రీ! రంగయ్యా! లలితలలిత — సుకుమార — కోమల — మృదుల — పేశల — మంజులారుణ మైనయట్టిపాదమును — ఈనిర్భాగ్యుని — ఈపరమపాపాత్ముని — ఈచలితేంద్రియుని — దైన — మహాకఠిన మైనయీతలపై మోప — ఆహా! నొచ్చిన దేమో కదా! నాయనా! నాతండ్రీ! లోకనాథా! దాసరక్షా! దీనబంధూ! సహజారుణ మైనపాదము కందిపోయిన దేమో? అయ్యయ్యో! ఈమహాపరాధమును నే నెట్లు భరింతునోయి రంగా! రంగా! రంగా! (బిగ్గరగ నఱచుచు లేవఁబోయి గుండెలు కొట్టుకొని నేలఁ బడును.)

శ్రీ — ఆహా! ఈతనిభక్తి యాకస్మికముగా నుద్బోధ మైనది. మహాదృష్టము సంభవించెను.

గీ. ఐహికాపేక్ష దిగలాగి ♦ నప్పుడితని
భక్తి మెల్లనఁ గ్రుంకి యా ♦ పట్టు దైన
కృపను వీడ హఠాత్తుగా ♦ నెగసెఁ బైకిఁ
గ్రుంగలాగి విడుచు చెట్టు ♦ కొమ్మఁబోలె.

విప్ర — గీ. బలిశిరంబునఁ దనపాద ♦ పద్మ ముంచి
యతని నిజభక్తుగాఁ జేసె ♦ నంబుజాక్షుఁ
డట్టిరంగయ్య కమ్మ! నా ♦ యందు నెంత
కృపయొ? నన్నాడ నట్లాద ♦ రించినాఁడు.

(శిరముపైఁ జేతు లుంచుకొని) ఇదిగో! నీపాదపద్మము. మెత్తమెత్తనొత్తెదను. ఆహా! నాతండ్రి! రంగా! రంగ! (తల నెత్తుకొనుచున్నాఁడు.) నాయనా! నీపాదమును గన్నుల కద్దుకొందును. (అట్లుచేయును.) బంగరుగజ్జలతో గలగలలాడి యొప్పులకుప్పలగునీపాదము లోకణ్ణక్! రాధ, పూర్వమున ముద్దుఁగొనినట్లు మదీయశిరోవతంస మైననీపాదమును ముద్దుఁగొందును. (తల

భక్తుచేతితాళంపుఁజి ♦ ప్పలును వేశ్య
యెనుట గబ్బిగుబ్బ లయి హే ♦ మించిపోవు.

గీ. పొగవలెను దుష్టపవనము ♦ పోల్కి- తెలియ
రాకయుండఁగ సానిదు ♦ ర్మహిమము మన
మనములను దూరి పరిశుద్ధి ♦ మన్నుఁ జేసి
నాశ మెఱుఁగనియాత్మకు ♦ నాశ మిచ్చు.

గీ. దానితోఁ బల్కఁ బని లేదు; ♦ దానిఁ గనఁగ
నక్కఱయె లేదు; మొద్దయి ♦ యద్ది యొద్ద
నున్నఁ జెనుట నిక్కము నల్లు ♦ లున్న మంచ
ము వలసను మంచిదియుఁ జెడి ♦ పోవుఁ గాదె?

విప్ర—సాష్టాంగస్థితినుండియు, నీతిరుముఖమండలదర్శన మవిచ్ఛిన్నము గఁ జేయుటకుఁ గన్ను లిక్కడ నుంచ లేకపోయితివా? (తలను జూపును) రంగా! రంగ! తిరిగి లేవనక్కఱ లేకుండును గాదా? మహాప్రభూ! (లేచును.) ఆహా! మహాత్మా! నీదివ్యనై భవదర్శన మపేక్షించి యిచటికి వేంచేయుభక్తులపాదపరాగము నాకుఁ బాదాదిశిరఃపర్యంత మంటి యొల్లు ప్రకాశించుచున్నదో భక్త పాదరేణువులచే నీసన్నిధానమున నిట్లు పవిత్రుఁడనుగఁ జేయఁబడిననే నింతటినుండి ‹‹భక్తాంఘ్రిరేణు›› వనునామమును ధరింతును.

శ్రీ—గ్రామపౌరుషవ్యాపారాదిజన్యనామములఁ ద్రోసి తత్తదీయసంబంధసూచకాభిధానముల ధరించువాఁడే నిజముగ భక్తుఁడు కదా! భక్తాంఘ్రిరేణు వనఁగ ద్రావిడమున ‹‹దొండరడిప్పొడి›› యగును. అధోగతినుండి రంగకటాక్షమున హఠాత్తుగ మహోన్నతస్థితిగలిగినయీతనిలోనిమార్పు నూతనజన్మమువంటిదే కాన నూతననామముగూడ సర్వమే. ఆహా! భక్తిమహిమము!

ఆ. వె. వేశ్యవీథి తేరు ♦ వీథి యయ్యెను; విటుల్
పరమభక్తు లైరి; ♦ హరిపాద
రజము పూతమయ్యె ♦ రంగఁ డాలయముతో
నిట గుడిసెలనడుమ ♦ నిలిచినాఁడు.

విప్ర—(చేతులెత్తుచు) అందవా? అందవా? తండ్రీ! తండ్రీ! (ఎగు
రును) అంద వేమి? రంగా! రంగా! రంగా! తండ్రీ! తండ్రీ!

ఆ. వె. దాసుఁ డెగుర లేక ♦ గాసిల రంగయ్య!
యీవు వంగి నన్ను ♦ నెత్తవలదె?
ఎగిరి కరము లెత్తి ♦ యెగఁబ్రాఁకుపుత్త్రకు
నిట్టె తండ్రి వంగి ♦ యెత్తుకొనఁడె?

(ఎగిరి, ఎగిరి) రంగరంగరంగా! (పడిపొరలుచున్నాఁడు.)

శ్రీ—ఈతనిభక్తి మునుపటిదానికంటె ద్విగుణముగ నున్నది. ఎందు
చేతనో?

గీ. అను ముల్చినఁగాని పు ♦ ష్పాంచితంబు
కాదు మల్లె; తలంగోయఁ ♦ గాని మొవ్వ
వేయ దరఁటి; చెప్పున రాచి ♦ విసువఁ గాని
దనియ మెదుగదు; భక్తి యీ ♦ దారి యేమొ?

గీ. అనిలదేవుఁడు శైరఁయ్యె ♦ మనక ముందుఁ
బలచఁబడి చప్పఁబడు నిర ♦ భ్యంతరముగఁ
బొంగఁదలఁచు నబ్ధి; వెనుకఁ ♦ బోవుభక్తి
యల్లెగయుటకు ముందు వె ♦ న్కాడు నేమొ?

ఆహా! భక్తపాదపరాగము దేహమునకు నెంత యంటుకొనిన
నంతమంచి దని యీమహాత్ముఁడు నేల దొరలుచున్నాఁడు.

గీ. గంధగజ మెక్కు భూపతి ♦ ఘనుఁడు గాఁడు
ప్రాణవాయువులను బిగ్గఁ ♦ బట్టి మింట

నుండువాఁడు ఘనుండు కాఁ – డొడలు తెలియ
కిలను బొరలుచుండెడు భక్తుఁ – డే ఘనుండు.

ఆహా! ఎంతవిస్మృతిగ నున్నాఁడు. మహాత్మా! లేచెదరా? (లేవఁదీయుచున్నాఁడు.)

విప్ర— ఓఓఓ! నాతండ్రీ! నాతండ్రీ! నిన్నుఁ జేరుటకు నాకుఁ జేయూఁత యిచ్చితివా? ఎగరలేక పడిపోయిననన్ను నీయొద్ద కెత్తితివా? రంగా! రంగా! రంగా! దేవరదాసుఁడను (శ్రీనివాసునకుఁ బ్రదక్షిణము సేయును)

శ్రీ— ఆహా నన్ను రంగనిగ భావించుచున్నాఁడు. నేనీతనివెనుకకుఁబోవ నేమిచేయునో చూతును. (అట్లుపోవును.)

విప్ర— భక్తుఁడగునాంజనేయునిఁ గౌఁగిలించిన యాసీరుహహస్తములతో నన్నొకసారి స్పృశింపవా? ఏదీ ఏదీ! (కౌఁగిలింపఁ బోయి పడును. తిరిగిలేచి) అదుగో! రంగఁడు! ఇదుగో! రంగఁడు! అదుగో రంగఁడు! అదుగో! రంగఁడు! ఎక్కడఁ జూచిన రంగఁడే! ఎక్కడ జూచిన రంగఁడే! నాయఱచేతులలో రంగఁడు! నావక్షస్స్థలమున రంగఁడు! (కన్నులు మూసికొని) అదుగో! నాలోఁగూడ రంగఁడు! వెలుపల నంత రంగఁడు! రంగనిలో నేను; నాలో రంగఁడున్నాఁడు. నేనికఁ గన్నులు తెఱవను. నాలోనున్న రంగదేవు నాంతరదృష్టిచేఁ జూచుకొందును. (పడును.)

శ్రీ— ఇది భక్తి కవధి కాఁబోలు! ఈతనిభక్తిక్రమము నేను నాకుఁ దోఁచినట్లు కనిపెట్టితిని. మొట్టమొదట నల్పజ్ఞానేంద్రియ మగు స్పర్శయందు భగవదనుభవ మారంభమై పులకాంకురాదులు కలిగినవి. అటుతరువాత జ్ఞానసంపత్తిచే నగ్రగణ్యమగు నేత్రేంద్రియమునకుఁగూడఁ దదనుభవము వ్యాపించి శ్రీరంగదేవాలయ మెదుటఁ గానఁబడ దానిలో రంగనిఁ గాంచెను. తరువాత

నాలయమూది బహిస్సంబంధశూన్యముగనే నన్నే రంగనిగ ధ్యానించెను. అటుపైన లోక మంతయు రంగమయమై కంటికిఁ గానఁబడెను. తరువాత బాహ్యేంద్రియవ్యాపార మక్కఱలేక యే యాంతరదృష్టిచే రంగని దనలోను వెలుపలను గాంచెను. ఆహా! వెఱ్ఱిలోఁగూడ నెంతక్రమమున్నది!

గీ. ప్రకృతిక్రమ మెప్డు తప్పదు ♦ క్రమము తప్ప
వెఱ్ఱి యుండదు రసత్వంబు ♦ వెఱ్ఱిలోన
ననుభవించువానికిఁ జూడు ♦ సతనికైనఁ
దత్క్రమము మతివేగమున బో ♦ ధంబు కాదు.

గీ. మనసు చెడుట వెఱ్ఱి యటంచు ♦ మనుజు లందు
రది యమితవృద్ధి నందుట ♦ యగుచు వెఱ్ఱి
జ్ఞానరాగంబులం దేది ♦ యైనఁ బొంగ
కుండ వెఱ్ఱిలే దా వెఱ్ఱి ♦ యుండ మేలు.

గీ. సమ్యకమునను మెత్తఁద ♦ నమునను పర
కష్టజాత్రినో యూహినో ♦ కరుణలోను
కొలఁదియో గొప్ప దేననో ♦ కొంతవెఱ్ఱి
గలుగువానికిఁ గాక స ♦ ద్గతియె లేదు.

గీ. మనసుభాగము లన్ని తూ ♦ చినవడుప్రన
గలిగి కొలబుఱ్ఱతోఁ దిని ♦ కొలిచి పరుని
కిచ్చి వేడి చల్వయును గా ♦ కెసఁగునరుని
కచట నిచటను సద్గతి ♦ యరుదు సుమ్ము.

గీ. పరమపద మొందఁదలచిన ♦ ప్రతినరుండు
నిత్యస్థితిని బొందక తీఱ ♦ దట్టు గాక
మెత్త లున్నకుర్చికి నాని ♦ మింటితండ్రి!
యని మొఱవెట్టు గళశోష ♦ మగుటె ఫలము.

గీ. ఇట్టిభక్తుఁడు దేవ నీ ♦ కించుఁ గనులు
మూసికొన్నియైనఁ; గడుపాఱ ♦ నేసి కనులు
మూసి ధ్యానించునరునికిఁ ♦ బొడముకుండో?
గరిటెయో? కుక్కతోఁకయో? ♦ కానిపించు.

గీ. విగ్రహారాధనము, వర్ణ ♦ విభజనంబు,
లింగభేదంబు, నిట్టిశ్రీ ♦ రంగభక్త
వరున కక్కఱ లేదన్ని ♦ పట్లదేవ
పొడఁగనెడునాతనికి భేద ♦ బుద్ధియెల్లు?

గీ. ఇట్టిపరమప్రపన్నున ♦ కెట్టికర్మ
ములు పనియె లేవు స్నానసం ♦ ధ్యలను మాని
విస్మృతిఁ గొంటకు చెడఁద్రాగి ♦ వీరవైష్ణ
వప్రపన్నుల మనుకొంట ♦ పట్టితప్పు.

గీ. కర్మశూన్యత్వము ప్రపత్తిఁ ♦ గలుగవచ్చు
గర్మశూన్యత ప్రపత్తి ♦ కలుగఁబోదు
కలితఫలశక్తి భాగ్యంబు ♦ గలుగవచ్చు
గాని సంపదచే బుద్ధి ♦ గలుగఁగలదె?

గీ. భక్తి యాత్మలో నిండెను ♦ వఱకు స్మరణ
నృత్యములు తప్ప వఱుమైన ♦ నేమి లేవు
నీటిలో ముంచఁబడు కూజ ♦ నిండువఱకు
గుడుగుడనుఁగాని పిదప కి ♦ క్కురనునొక్క?

అహా! ఈమహాత్ముఁ డింక స్మృతిలేక యున్నాఁడు. స్వామీ! దేవా! తొండరడిప్పొడియాచార్యోత్తమా! ఆహా! ఇంకఁ బలుక కున్నాఁడు. ఈవిస్మృతి యెప్పటికి వదలునో? ఇంత యొడలు తెలియక యుండువానిని నేనెట్లు శ్రీరంగక్షేత్రమునకుఁ దీసికొని పోవుదును? హా! ఏమిదిక్కు! దేవదేవి యేమైనదో తెలియదు.

ఆహా! ఎంతదుర్మార్గురాలు! ఈతఁడినది యిట్లు భంగపఱచి యి ట్లుపేక్షించుటకుఁ గారణ మేమో యగ్రాహ్యమై యున్నది. ఆ హా! రంగరంగరంగా! రంగ!

(నేపథ్యమున) ఎవరచ్చట! రంగనామస్మరణమును జేయుచున్నారు?

శ్రీ—నేను విప్రనారాయణభాగవతోత్తమునిశిష్యుఁడను—

(నేపథ్యమున) ఆమహాత్ముఁ డచ్చట నున్నాఁడా?

శ్రీ—ఉన్నాఁడు. నీవెవఁడ వయ్యా?

(నేపథ్యమున) నిచుళాపురభూపాలుఁ డాతనిని దరిసించుటకు వ చ్చుచున్నాఁడు.

శ్రీవి—అహా! రాజుగారే! దయచేయుఁడు.

(రాజు ప్రవేశించును.)

రాజు—(ప్రదక్షిణము చేసి) విప్రనారాయణాచార్యోత్తమా! దాసోహం దాసోహం. భక్తిపారవశ్యమున నిట్లుంటివా? అయ్యా! నేనీమ హాత్ముని శ్రీరంగమునకుఁ దీసికొనిపోవ వచ్చితిని.

శ్రీ—ఈతఁ డిచ్చట నున్నట్లు ప్రభువుల కెట్లు తెలిసినది.

రాజు—నా కీదినమున జాము ప్రొద్దెక్కినది కీలేఖ చేరినది. ఇది దేవ దేవి యను నొక వేశ్య వ్రాసినది. చదివెదను. వినుము.

(చదువుచున్నాఁడు.)

“అయ్యా!

విప్రనారాయణుఁడు నిశ్చలభక్తుఁ డని మాయక్కయు చలితేంద్రియుఁ డని నేనును వాదులాడు కొని తుద కాతని భ్రష్టుని జేసెద నని నే నామెతోఁ బందెము వైచితిని. అట్లు భక్తిభంగుని గావించి యాతని మావీథికి ర ప్పించితిని. కాని యాతనికి బ్రహ్మచర్యవ్రతభంగము కాలేదు. ఆతని కిట్టికురవస్థ నామూలమునఁ గలిగినప్పటినుండియు నా కే

మో యమిత మగునాందోళనము, మనసునఁ గలిగి, ప్రపంచము
ను రోసి, విరాగినినై, దైవేచ్ఛచే భక్తిలేశావృతనై యెచ్చటి
కో యీయుదయముననే పోవుచుంటిని. మీరు నన్ను వెదుక
వలదు. మీకు నేను గనఁబడను. కాని శ్రీరంగభక్తుఁ డగు మ
హాత్ముఁడు మావీధి నున్నాఁడు. ఆతనిని మీరు శ్రీరంగమునకు
గౌరవపూర్వకముగఁ దీసికొనిపోయి యాతనివశమునఁ బ్రవేశ
పెట్టుఁడు. ఆతనిని రంగఁడే సర్వవిధములఁ గాపాడు ననునిశ్చ
యవిశ్వాసము కలిగినదాననయ్యును మీ కీమహాత్ముని సేవవల
నఁబుణ్యము రాఁగల దని వ్రాసితిని,,

తిరుక్కరంబనూరు. } చిత్తగించవలెను. దేవదేవి.

శ్రీ—(తనలో) ఇప్పటికి నాసందేహము తీఱినది. ఇంతకాలమునుండి గు
రుసేవఁ జేసిననాకుఁ బూర్ణభక్తి కలుగలేదు కాని, కుహనాభ
క్తి యొనర్చిన దేవదేవి యిట్టి భక్తురా లయ్యెనుగదా! అదృ
ష్టము!

రాజు—ఈదేవదేవి యెవ్వతెయో? ఈలేఖ యెంతసత్యమో యని నేను
పేక్షించి రేపు చూడవచ్చు నని యెంచి యీరాత్రి నిదురింప
నొకనాల్గుగడియలక్రిందట శ్రీరంగేశ్వరుఁడు స్వప్నమున నిట్లు
సాయించెను.

శ్రీ—ఎట్లు? మహాత్మా!

రాజు—,, మదీయభక్తాగ్రగణ్యుఁ డగువిప్రనారాయణుఁడు తిరుక్కరంబ
నూర వేశ్యావీధి నున్నాఁడు. నీ విప్పుడపోయి యాతనిని మా
పల్లకిలో నుంచి సమస్తవైభవములతోఁ దెల్లవాఱకుండ మాస
న్నిధికిఁ దీసికొని రావలయును,, అని.

శ్రీ—ఆహా! రంగనికటాక్షము.

రాజు—పల్లకి యట నున్నది. ఈతని నిమ్మళముగ లేవఁదీయుము.

శ్రీ—ఈతని కింక స్మృతి రాలేదు.

రాజు—శ్రీరంగేశ్వరుని నిర్మాల్య మగుచందన మీాతని దేహమునకుఁ బూసి శ్రీపాదతీర్థము లోని కిచ్చినఁగాని స్మృతి రాదు. ఆలసింపకుము.

శ్రీ—చిత్తము. (లేవఁదీయును.)

రాజు—ఇప్పు డింక నిచ్చటఁ గావలసిన దేమి?

శ్రీ—ఏమియు లేదు ఐననిట్లు కావలయును.

గీ. ధరణి యీతిబాధలు లేక ♦ తనరుఁగాక
ప్రజలయన్యోన్యవైరముల్ ♦ పాయుఁగాక
కవిత రాజపోషణమునఁ ♦ గ్రాలుఁగాక
నీతిపాలనమున రాజు ♦ నెగడుఁగాక.

రాజు—తథాస్తు. తథాస్తు.

(అందఱునిష్క్రమింతురు.)

ఇది షష్ఠాంకము.

సర్వమును సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

